స్వాత్మీయం-స్వ శ్చాసౌ ఆత్మా చ = స్వాత్మా, స్వాత్మనః అయం= స్వాత్మీయః, తమ్=స్వాత్మీయం।

భాస్వరశ్వైతిమానం - భాస్వరశ్చాసౌ శ్వైతిమా చ=భాస్వర శ్వైతిమా, తం=భాస్వర శ్వైతిమానం।

ద్యుమణి కిరణ శ్రేణయః - ద్యుమణేః కిరణాః = ద్యుమణికిరణాః, ద్యుమణికిరణానాం శ్రేణయః=ద్యుమణికిరణ శ్రేణయః।

భావము :

చీకట్ల కడలికి బడబాగ్నియు, రాత్రి భర్తయైన సూర్యుని యెడ బాపుచే బాధపడు కమలవనములకు వికాసమనెడి హాసము నొసంగువాడునునగు నీ సూర్యుడు మింట దూరమునకుఁ బోయెను. సూర్యుని కిరణ పంక్తు లప్పటికిని గగనము నెల్లఁబఱచుచున్నవి. ఇట్లు గగనము నెల్లఁబఱచినను నా కిరణములు, తమకు సహజమైన యయ్యుజ్జ్వలమగుఁ దెల్లఁదనమును ధరింపవా యేమి? అనగా శీఘ్రముగనే ధరింపఁగలవు. కాన నీవు పడకనుండి లేచుట కిది తగిన సమయ మని యాశయము ॥64॥

శ్లో. ప్రాతర్వర్ణనయాఽనయా నిజవపుర్భూషా ప్రసాదానదాద్
దేవీ వః పరితోషితేతి నిహితా మన్తఃపురీభిః పురః,
సూతామణ్డన మణ్డలీ పరిదధు ర్మాణిక్యరోచిర్మయ
క్రోధావేగ సరాగలోచనరుచా దారిద్ర్య విద్రావిణీమ్. ॥65॥

ప. వి. ప్రాతర్వర్ణనయా-అనయా- నిజవపుః- భూషాప్రసాదాన్ - అదాత్-దేవీ-వః-పరితోషితా -ఇతి నిహితామ్ - అన్తఃపురీభిః-పురః-సూతా - మణ్డన మణ్డలీ - పరిదధుః - మాణిక్యరోచిర్మయక్రోధావేగసరాగలోచనరుచా - దారిద్ర్యవిద్రావిణీమ్।

అర్థము : హే వందినః=ఓస్తుతిపాఠకులారా!, అనయా=ఈ మీచేఁ జెప్పఁబడిన, ప్రాతర్వర్ణనయా=ఉదయకాలపువర్ణనముచే, పరితోషితా=సంతోష పెట్టఁబడిన, దేవీ=దేవియగు దమయంతి, వః=మీకొఱకు, నిజవపు

ర్భూషాప్రాసాదాన్; నిజ=తనదగు, వపుః=శరీరముయొక్క, భూషా ప్రసాదాన్=ఆభరణము లనెడి పారితోషికములను, అదాత్=ఇచ్చినది. దేవి యిచ్చినదని చెప్పుటవలన నలుడు, భవనమును వీడి సంధ్య నుపాసించుటకై దానికి ముందే వెళ్లెనని సూచితము. ఇతి=ఇట్లు, ఉక్త్వా=చెప్పి, అన్తఃపురీభిః=అంతఃపురమందు నియమింపఁబడిన చెలికత్తెలతో, పురః=స్తుతిపాఠకులయొక్క యెదుట, నిహితాం=ఉంచఁబడిన, మాణిక్యరోచిర్మయక్రోధావేగసరాగలోచనరుచా; మాణిక్య=పద్మరాగములయొక్క, రోచిర్మయ=కాన్తిరూపమైన, క్రోధావేగ=దారిద్ర్యమునుఁ గూర్చిన కోపవశముచేతనో యనునట్లు, సరాగ=ఎఱ్ఱఁదనముతోఁ గూడిన, లోచనరుచా=నేత్రకాన్తిచే, (ననగా భూషణములయందలి కాన్తిచే నని యర్థము) దారిద్ర్యవిద్రావిణీం; దారిద్ర్య=పేదరికమును, విద్రావిణీం=తఱుమగొట్టునదియో యనునట్లున్న, మణ్డనమణ్డలీం=భూషణముల సమూహమును, సూతాః=స్తుతిపాఠకులు, పరిదధుః=తమశరీరమునందు దాల్చిరి.

సమాసములు :

*ప్రాతర్వర్ణనయా* - ప్రాతః వర్ణనా = ప్రాతర్వర్ణనా, తయా = ప్రాతర్వర్ణనయా.

*నిజవపుర్భూషాప్రసాదాన్* -నిజం చ వపుశ్చ = నిజవపుః, నిజవపుషః భూషాః=నిజవపుర్భూషాః, నిజవపుర్భూషా ఏవ ప్రసాదాః=నిజవపుర్భూషాప్రసాదాః, తాన్=నిజవపుర్భూషాప్రసాదాన్.

*మణ్డనమణ్డలీం* - మణ్డనానాం మణ్డలీ=మణ్డనమణ్డలీ, తాం=మణ్డనమణ్డలీం.

*మాణిక్యరోచిర్మయక్రోధావేగసరాగలోచనరుచా* - మాణిక్యానాం రోచీంషి=మాణిక్యరోచీంషి, మాణిక్యరోచిషాం రూపం యస్యాః స్సా=మాణిక్యరోచిర్మయీ, క్రోధస్య ఆవేగః=క్రోధావేగః, రాగేణ సహ వర్తన్త ఇతి = సరాగాణి, సరాగాణి చ తాని లోచనాని చ=సరాగలోచనాని, సరాగలోచనానాం రుక్ = సరాగలోచనరుక్, క్రోధావేగేన సరాగలోచనరుక్=క్రోధావేగసరాగలోచనరుక్, మాణిక్యరోచిర్మయీ,

నిర్గమః=మేడనుండి వెలుపలికి వచ్చుట గల్గిన, భూపతిః=నలమహారాజు, స్వర్గఙ్గామ్బుని; స్వర్గఙ్గా=ఆకాశగంగయొక్క, అమ్బుని = ఉదకమునందు; కృతదినారమ్భాప్లుతిః, కృత=చేయఁబడిన, దినారమ్భ= ప్రాతఃకాలమందలి, ఆప్లుతిః=స్నానము గలవాడై, ప్రియాయౌతుకప్రాప్తం; ప్రియా=ప్రియురాలగు దమయంతియొక్క, యౌతుక= వివాహకాలమందలి యరణముగాఁ, ప్రాప్తం=లబ్ధమైన, అతిపుష్పకం= పుష్పకవిమానము నతిశయించిన, రథం=రథమును, అధిష్ఠాయ= ఎక్కి, ఆనన్దాత్=ఆనందమువలన దమయంతితోటి సమాగమమువలని సంతోషముతో, ఆగచ్ఛన్ = తిరిగివచ్చుచున్నవాడై, ఉషః = వేకువయందు, భణతాం=అట్లే వర్ణించుచున్న, వన్దినాం=స్తుతిపాఠకుల యొక్క; దృశాం=నేత్రములకు, ఆతిథ్యం=విషయమును, క్షణం= కొంచెముకాలము భవనములోపలికిఁ బ్రవేశించుటకు పూర్వమువరకును, ఆనశే=పొందెను, అనగా వారిచేఁ జూడఁబడెనని యర్థము. కావుననే నలుడు స్నానమునకై వెళ్లుటవలన, పూర్వశ్లోకమునందు దేవియగు దమయన్తియే వందులకుఁ బారితోషికము నిచ్చెనని చెప్పఁబడినది.

సమాసము :

**ఆతిథ్యం**- అతిథేః భావః=అతిథ్యం, తత్=ఆతిథ్యమ్.

స్వర్గఙ్గామ్బుని- స్వః గఙ్గా=స్వర్గఙ్గా, స్వర్గఙ్గాయాః అమ్బు, స్వర్గఙ్గామ్బు, తస్మిన్=స్వర్గఙ్గామ్బుని.

కృతదినారమ్భాప్లుతిః- దినస్య ఆరమ్భః = దినారమ్భః, దినారమ్భే ఆప్లుతిః = దినారమ్భాప్లుతిః, కృతా దినారమ్భాప్లుతిః యేన సః = **కృతదినారమ్భాప్లుతిః.**

**భూపతిః**- భువః పతిః=భూపతిః.

అతిపుష్పకం- పుష్పక మతిక్రాన్తః=అతిపుష్పకః, తం=అతిపుష్పకం.

ప్రియాయౌతుకప్రాప్తః - ప్రియాయాః యౌతుకం = ప్రియా యౌతుకం, ప్రియాయౌతుకే ప్రాప్తః = ప్రియాయౌతుకప్రాప్తః, తం=ప్రియాయౌతుకప్రాప్తం.

అవరాగతైః- అవర మాగతాః=అవరాగతాః, తైః=అవరాగతైః.
అవిదిత ప్రాసాదతో నిర్గమః- ప్రాసాదతః నిర్గమః = ప్రాసాదతో నిర్గమః, న విదితః=అవిదితః, అవిదితః ప్రాసాదతో నిర్గమః యస్య సః=అవిదితప్రాసాదతోనిర్గమః.

భావము :

దమయంతి స్తుతిపాఠకులకుఁ బారితోషికము నిచ్చిన పిదప స్నానమునకై నలుడు భవనము వెలుపలికి పోయిన తర్వాత వచ్చినట్టి వైతాలికులకు తెలియకుండ వెలుపలికి వచ్చిన నలమహారాజు గంగా ప్రవాహమునందుఁ బ్రాతః స్నానము గావించినవాఁడై, ప్రియురాలగు దమయంతియొక్క వివాహకాలమందర్పణముగా సంపాదింపఁబడినట్టిదియు పుష్పకవిమానమును మించినదియు నగు తేరునెక్కి, దమయంతితో సమాగమము గల్గుననెడి యాశచే నేర్పడిన యానన్దము వలనఁ దిరిగి వచ్చుచున్నవాఁడై తాను భవనములోపలికిఁ బ్రవేశించునంతవరకు ప్రభాతకాలమును వర్ణించెడి వైతాలికుల దృష్టియందుఁ బడెను. ॥౬౬॥

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చ యమ్.
ఏకాం న త్యజతో నవార్థఘటనా మేకాన్నవింశో మహా
కావ్యే తస్య కృతౌ నలీయచరితే సర్గోఽయ మస్మి న్నగాత్.
॥67॥

ప. వి. శ్రీహర్షం- కవిరాజరాజిముకుటలఙ్కారహీరః- సుతం-శ్రీహీరః-సుషువే-జితేన్ద్రియచయం-మామల్లదేవీ-చ- యం- ఏకాం- న- త్యజతః- నవార్థఘటనాం-ఏకాన్నవింశః-మహాకావ్యే-తస్య-కృతౌ- నలీయచరితే- సర్గః-అయమ్-అస్మిన్-అగాత్.

అర్థము: కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి=పఙ్క్తిలో, మకుట = శ్రేష్ఠులైనవారికి, అలఙ్కార=భూషణమైన, హీరః=వజ్రమణియగు, శ్రీహీరః=శ్రీహీరుడు, జితేన్ద్రియచయం=

జిత=జయింపఁబడిన, ఇంద్రియచయం = ఇన్ద్రియసమూహముగల్గిన, శ్రీహర్షం=శ్రీహర్షుడను పేరుగల, యం=ఏ, సుతం=కుమారుని, సుషువే=ఉత్పత్తి గావించెనో, మామల్లదేవీ చ = మామల్లదేవియను తల్లియు, యం=ఎవనిని, సుషువే=కనెనో, ఏకాం=ముఖ్యమైన, నవార్థఘటనాం = అపూర్వమగు సృష్టిని, న త్యజతః=విడువనట్టి, తస్య=అశ్రీహర్షుని యొక్క, కృతౌ=కృతియైన, మహాకావ్యే=మహాకావ్యమైన, అస్మిన్=ఈ, నలీయచరితే = నైషధీయచరిత్రమునందు, ఏకాన్నవింశః=ఊనవింశమైన, స్వర్గః=సర్గ, అగాత్=కడచినది.

సమాసము : 

నవార్థఘటనాం- నవాశ్చ తే అర్థాశ్చ=నవార్థాః, నవార్థానాం ఘటనా=నవార్థఘటనా. తాం=నవార్థఘటనాం.
ఏకాన్నవింశః- ఏకేన న వింశః=ఏకాన్నవింశః. తక్కిన సమాసములు భావములు పూర్వశ్లోకములకు వలెనే గ్రహించునది. ॥62॥

ఇతి



శ్రీమదాత్రేయగోత్ర శ్రీమదుడాలి నృసింహశాస్త్రి తనూజ

విక్రమసింహపురీ వేదసంస్కృత కళాశాలా

భూతపూర్వప్రధానోపాధ్యాయ

శ్రీ సుబ్బరామశాస్త్రి

విరచితమగు

నైషధాంధ్రవ్యాఖ్యకు

ఊనవింశసర్గ

సమాప్తము.

॥శమ్॥